కళాప్రచారకసమితి.

అనుబంధము

# తేనెపట్టు

పాలవెల్లితోఁబుట్టువు.

మండపాక పార్వతీశ్వరశాస్త్రి.



# తేనెపట్టు

కళాప్రచారక సమితి ప్రచురములకు

అనుబంధము ౧

("తేనెపట్టు" "పాలవెల్లి"కి తోఁబుట్టువు)

కృతికర్త

మండపాక పార్వతీశ్వరశాస్త్రి,

"పాలవెల్లి" గ్రంథకర్త.

| పాలవెల్లి | తేనెపట్టు |
|---|---|
| వెల 0—8—0 | వెల 0—8—0 |

ఈ రెండును ఏకకాలముఁగోరు వారికి 12 అణాలకే యివ్వబడును.

పోస్టేజీలు ప్రత్యేకము.

కొలది ప్రతులే ముద్రింపబడినవి.

కళాపరిచారక సమితి ప్రచురములన్నింటిని గైకొనుచున్న వారికి

పాలపెల్లియు తేనెపట్టును

ఒక్కొక్కటి ఆరు అణాలు చొప్పున

యివ్వబడును.

ముద్రాపకుండును
ప్రకాశకుండును
దేవరాజు
వేంకట కృష్ణారావు,
బరంపురం, [గంజాం.]

వేగుంజుక్క ముద్రణాలయము
బరంపురం,
(గంజాం.)

# క్రొత్త కథ.

ఇది క్రొత్తకథ — కళాప్రచారక సమితివారి మొదటి ప్రచురమగు సంజయుని రాయబారమునకు ఇది అనుబంధము. ప్రాతకథయైన పాలవెల్లి మహావిద్వాంసుల యామోదమును, మహారాజుల యాదరణమును బడసినది. ఈక్రొత్తకథ యెట్లు రుచించునో చూడవలసి యున్నది.

ఏది యెట్లున్నను తేనెపట్టు లోకమునకానందము కలిగింపక పోదను విశ్వాసము మాత్రము కలదు.

ఇది అనుబంధగ్రంథము కావున, ఆంధ్రమహాజనులతోడి శాశ్వతమైన యనుబంధమును బ్రతిష్ఠించుచున్నది.

బరంపురం,
1—12—'33.

మండపాక పార్వతీశ్వరశాస్త్రి,
అధ్యక్షుడు.
కళాప్రచారకసమితి.

"వేగుఁజుక్క" ముద్రాలయమునకును
వేగుఁజుక్క "గ్రంథమాల" కును
లేశమును సంబంధము లేదు.
వేగుఁజుక్క "గ్రంథమాల" కును నాకును
1925 నుండియు
ఎట్టి సంబంధమును లేదు.

దేవరాజు వేంకట కృష్ణారావు,
కార్యదర్శి.
కళా ప్రచారక సమితి
బరంపురం,
(గంజాం.)

గీ॥ ప్రబల భల్లుకనఖభల్లభయదమథన
శిథిల మధుకోశ విసర విశీర్ణమక్షి
కాంతరాంతరదంతురితాతపమునఁ
బుడమి తిలతండులన్యాయమున వెలుంగు.

— అల్లసాని —

# తేనెపట్టు

## నేను

తేఁటిబిడ్డను నేను; ... ... ... ... ...
తేనెపట్లల్లి
కాలముఁ బోషించునట్టి కులవృత్తి మాకు.

  

దారి తెన్నులు లేని, దరిదాపులేని,
యడవిలోఁ గాఁపురం బలవడు మాకు —
పెక్కు పుట్టువులందుఁ బెంపొందుచున్న
తపముకల్మినిఁ జెట్లు తమకింపుగాఁగ,
లోకాని కింపుగా, లోకనాథునకు
నింపుగాఁ బూచి యర్పించినపూలు, —
రంగురంగులపూలు, రాణించుపూలు —
చుట్టు చుట్టుకుఁబోయి, చెలిమి కావించి,
యాపూవులనుజూచి, యందంబుమీఱఁ,
దేనియ సమకూర్చి, తేఁకువఁ బేర్చి,
యొక్క తావుకుఁ జేర్చి, యోపికఁ దార్చి,
పట్టు గాఁగల్లి, యీశ్వరప్రీతిగాఁగ,

లోకాని కర్పించి, లోకంపు సేవఁ
గులముఁబోషించునట్టి కులవృత్తి మాకు.
తాతలు, తండ్రులు, తండ్రితాతలుగఁ
దరతరంబులనుండి, తప్ప కెప్పుడును
నీకులవృత్తి జీవించుచున్నాము.
కాలభేదాన, దేశాలభేదాన,
నించుకించుక క్రొత్త యేర్పడునేమొ,—
కాని, తొల్లింటిదేయాను మాత్రోవ.
బలముచాలక, తపోబలముచాలకయుఁ,
బెద్దత్రోవలఁబోవఁ బెద్దలరీతి
నేర్పసాలదు గాని, మాకెట్లుకలుగుఁ
గులవృత్తిఁ జీవింపఁ దలఁచువారలకు?
రంగురంగులపూల, రాణించుపూల,
చెలిమిసేయుట ప్రేమకలిమియే కాని,
రంగులు మాకేల, రాణ మాకేల,
రంగు-రాణల మించి రాజిల్లుచున్న
యమృతమంతయుఁగూర్చి యమరించుచుంట
యుగ్గుతోఁబోసిన యుచితంపువిద్య.
మప్పితంబదిలేక, మర్యాదలేక,
ఊఁ యన్న, ఆఁ యన్న, నులికి, పైఁబడుచు
నేద్చుచుఁ గఱచుచు, నేవలం గనెదు.
కందురీఁగలపుట్ట గాదు మాపట్టు—

తేనెపట్ట

ఏమన్న ననుము మాకేల యీచింత?—

*      *      *

కుఁజ్ఞ్ఞి ననలేక, కూర్మిమీఱంగ
నీ తేనెపట్టెల్లి, యిందునిల్పితిని.
కమ్మఁజిన్నదంచుఁ జీకాకుకొందకుము.
కలదందుఁ దేనె—

యూపలుకు నిక్కంబు—

తారతమ్యములెంచఁ దరమె నాకోటి
కెక్కువతక్కువ లేల లెక్కింప ?
కూర్చుటమాపని; కులవిద్య యదియు—
అనుభవించుటమీకుఁబని—

మీకుమాకు

నన్యోన్యబాంధవం బమరునీరీతి—
తేనెద్రావుఁడు మీరు తృప్తితీరంగ,
మమ్ముదీవింపుఁడు, మము మననిండు—
మాపెద్దలేగిన మంచిత్రోవలనె
మాబిడ్డలందఱు మఱిమఱిఁబోయి
మాకు, లోకానికి, మీకు, దేవునకు,
నానంద మొనగూర్చు నట్లు నిత్యంబు
మమ్ముదీవింపుఁడు మహాత్ములార, !
మము మననింపు, ప్రేమనిధానులార !

*      *      *      *

—

# స్వాగతము

దారిద్ర్యదేవతా, ధర్మస్వరూప,
స్వాగతం బిది నీకు స్వాగతంబయ్య ;
పరమమిత్రుఁడ వీవు పండితావళికిఁ,
గవుల కాప్తుండవై క్రాలుచున్నావు ;
రమ్ము నాయింటికి, రమ్ము నాకడకు,
స్వాగతం బిదె నీకు స్వాగతంబయ్య ;
స్వర్ణపాత్రంబునఁ బాయసాన్నంబు
కడుపారఁ దిన్నట్టి కవిసార్వభౌముఁ
డంతాన నీమైత్రి యలవడి కాదె,
ముక్తికాంతాకరంబు గ్రహింపఁగల్గె ;
భక్తుఁడై కవియును ప్రబలు పోతన్న
ప్రభులయాహ్వానంబుపై నాశవిడిచి,
నిన్నిలువేల్పుగా నిల్పుకొన్నాఁడు ;
ఇత్తర్థములకూర యింపుగాఁదినుచుఁ
బండితుండయి పెద్దిభట్టు వర్ధిల్లె ;
రాజులై కవులయి రాజిల్లువారు
గలరుకొందఱు, గాని, కనలేరు వారు
నీమహాత్మ్యంబును, నీగౌరవంబు ;
గరళంబు పుక్కిట గలిగియున్నట్టి

తేటపట్టు

కాలసర్పము ఫణాగ్రంబున మణిని
ధరియించినట్టు లోదారిద్ర్యమిత్ర,
ఆంగకును బాధ కధికంబవయ్యు,
మనసు పక్వము సేయు మహామంబు నీవ.
రాతిగుండియగల్గి రాజిల్లువాడు
సుమైత్రిఁ గొన్నాళ్ళు నెరపెనయోని,
వెన్నగుండియగల్గి విలసిల్లుచుండు;
కరుణచిత్తులు కవిగ్రామణుల్ గారు,
కరుణులు పండితాగ్రణులు గారేరు;
రసము పరిదర్శింప, రసము గ్రహింప,
దారిద్ర్యదేవతా స్థానమందున్న
కవిపండితులె నేర్పుగలిగినవారు;
నేను నీసన్నిధి నిత్యంబు నిలువఁ
గాంక్షించుచున్నాఁడఁ గాన, వేవేగ
రమ్ము నాయింటికి, రమ్ము నామిత్ర,
దారిద్ర్యదేవతా, ధర్మస్వరూప,
స్వాగతం బిదె నీకు వచియింతునయ్య;
వడివడి రమ్ము సుస్వాగతం బనుచు.

---

# ఓ నల్లమేఘమా!

*  *  *  *
ఎందుకే  *  *  *
*  ఎందుకే  *
*  *  ఓనల్లమేఘమా,
అందుకోరాకుండ, ఎగిరిపోతావే?
అబ్బాయి, అబ్బాయి, అందుకోబోకుమా,
నను బట్టుకోలేరు నీలాంటివాళ్లు;
ఎక్కడికిపోతావు ఓనల్లమేఘమా,
నన్ను నీతోగూడ తీసుకోపోవే!
దూరదేశాలకూ పోయివస్తానురా,
అబ్బాయి నాతోటి నీవురాలేవు;
దూరదేశాలన్ని నేనుచూస్తాను, నీ
వీపుమీదెక్కించి తీసుకోపోవే;
దూరదేశాలకూ నీవు రాలేవురా,
నావీపుమీదెక్కి కూర్చుండలేవు;
పోనిపోనీ గాని ఓనల్లమేఘమా,
ఎక్కడికి పోతావో చెప్పవేనాకు;
అల్లాసముద్రాని కిపుడు పోతానురా,
మంచినీళ్లను త్రాగి మళ్లివస్తాను.

ఆసముద్రంలోను ఏమేమి వుంటాయి,
ఆడుకోవచ్చునే వేటితోనైన?
ఓడలూ, నావలూ అక్కడుంటాయిరా,
ఆడుకోలేవురా వాటితోనీవు;
మానాన్న నాకొక్క ఓడ కొనియిచ్చేడు,
ఓడతో నావతో ఆడుకోగలనె!
వద్దురా, వద్దురా, నీవు రాలేవురా,
వస్తాను వస్తాను తీసుకోపోవే;
రాబోకు, రాబోకు,
వస్తాను, వస్తాను;
వద్దమ్మ, వద్దమ్మ,
వస్తానుసుమ్మ.

---

# ఆడుకొంటాను

1. తెల్లగామల్లెలూ పూచేటిచోట,
చల్లగా గాలులూ వీచేటిచోట,
హాయిగా చిలుకలూ చదివేటిచోట
కోయనుచు కోయిలలు పాడేటిచోట,
ఝుమ్మనుచు తుమ్మెదలు మూగేటిచోట
మాఅక్కతో నేను ఆడుకొంటాను,
ఆడుకొంటానమ్మ ఆడుకొంటాను.

2. పక్షులు గూళ్లకూ చేరేటివేళ,
ఆవులమందలూ వచ్చేటివేళ,
ఎదురుగా దూడలూ పోయేటివేళ,
మాఅమ్మ అన్నమూ వండేటివేళ,
మానాన్న యింటికీ వచ్చేటివేళ,
నేను మాఅక్కయ్య ఆడుకొంటాము,
మాతోటలో మేము ఆడుకొంటాము.

3. లక్కబొంగరము మాఅమ్మ యిచ్చింది,
బొమ్మలపుస్తకం నాన్న యిచ్చేడు,
చందనంబొమ్మ మామామ యిచ్చేడు,
మోటారుబండి మాతాత యిచ్చేడు,

తే నె ప ట్టు

అమ్మమ్మ యిచ్చింది యీ ౘైలుబండి,
అక్కయ్యతో నేను ఆడుకొంటాను,
ఆమూల యీమూల ఆడుకొంటాము.

4. మాఅక్కతో నేను ఆడుకొంటాను,
మాతోటలో మేము ఆడుకొంటాము,
అల్లరచేయక ఆడుకొంటాము,
ఆడుకొంటామమ్మ ఆడుకొంటాము,
నేను మాఅక్కయ్య ఆడుకొంటాము,
చల్లగా మెల్లగా ఆడుకొంటాము,
మాఅక్కతో నేను ఆడుకొంటాను.

5. ఎగురుతూ దుముకుతూ, ఆడుకొంటాము ;
గిరగిర తిరుగుతూ ఆడుకొంటాము,
దాగుడుమూతలూ ఆడుకొంటాము,
నేను మాఅక్కయ్య ఆడుకుంటాము,
మాతోటలో మేము ఆడుకొంటాము.
ఆడుకొంటామమ్మ ఆడుకొంటాము,
నేను మాఅక్కయ్య ఆడుకొంటాము.

# అలసిపోయితిని

అలసితిపోయితినయ్యో అలసిపోయితిని,
కటకటా, నీకింత కాఠిన్యమేల?

◆ ◆ ◆

తిరిగితిఁ దిరిగితిఁ దెరవులన్నియును,
వెదకితి వెదకితి వేసారిపోతి;
ఏమూలనుంటివో యీచలంబేల,
యెందుదాగుంటివో, యేల కన్పింపు?

◆ ◆ ◆

అలసిపోయితినయ్యో అలసిపోయితిని,
కటకటా, నీకింత కాఠిన్యమేల?

◆ ◆ ◆

గట్టుపైఁ బుట్టపైఁ గాల్జారి జారి,
పడుచు లేచుచు ముండ్లబాటలన్నియును,
వెదకితి, వెదకితి, విసివిపోయితిని,
దిరిగితిఁ దిరిగితిఁ దెరవులన్నియును,

◆ ◆ ◆

అలసిపోయితినయ్యో అలసిపోయితిని,
కటకటా, నీకింత కాఠిన్యమేల?

◆ ◆ ◆

ఆకసంబున మబ్బు లలముకొన్నపుడు,
చీకటి యంతటం జెదరియున్నపుడు,

తేనెపట్టు

వర్షంబు జోరనఁ బడుచుయున్నపుడు,
తిరిగితిఁ దిరిగితిఁ దెరవు దప్పితిని,

♦ ♦ ♦

అలసిపోయితినయ్యొ అలసిపోయితిని,
కటకటా, నీకింత కాఠిన్యమేల?

♦ ♦ ♦

గాలివీచుచు భీతిఁగలిగించువేళ,
చెట్టుకొమ్మలు మీఁద నట్టాడువేళ,
ఊపిరాడక, చిత్తము సుస్సురన్ వేళ,
వెదకితి, వెదకితి, వేసారిపోతి,

♦ ♦ ♦

అలసిపోయితినయ్యొ అలసిపోయితిని,
కటకటా నీకింత కాఠిన్యమేల?

♦ ♦ ♦

ఏవంక నుందువో యెఱుకలేదయ్యొ;
త్రోవతప్పితినయ్యొ త్రోవుపాటయ్యొ,
త్రోవచెప్పినవాఁడు తోడరాఁడయ్యొ,
ఈవేళ నాకేల సిట్టిపాటయ్యొ,

♦ ♦ ♦

అలసిపోయితినయ్యొ అలసిపోయితిని,
కటకటా, నీకింత కాఠిన్యమేల?

♦ ♦ ♦

అలసిపోయితినయ్యొ, అలసిపోయితిని.

# బండివాడు

శ్లో॥ ఈశ్వరం సర్వభూతానాం
హృద్దేశేఽర్జున తిష్ఠతి,
భ్రామయన్ సర్వభూతాని
యన్త్రారూఢాని మాయయా.

తమేవ శరణం గచ్ఛ
సర్వభావేన భారత,
తత్ప్రసాదాత్పరాం శాన్తిం
స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్.

ఓ బండినాయుడా, ఓ బండినాయుడా,
ఆనందపురికి నీ బండి కడతావా?
కడతాను మాబాబు, కడతాను మాతండ్రి,
ఆనందపురికి నా బండికడతాను;
ఆ ఊరి కెప్పుడూ పోలేదురా నేను,
త్రోవ తెలుసున నీకు, మంచిత్రోవేనా?
త్రోవ తెలుసును నాకు, మాది ఆ ఊరేను,
త్రోవమంచిది కాదు, నాటుత్రోవండి.
నాటుత్రోవను నీవు, త్రోలగలవా బండి,
బండియెడ్లూ నీవి బలముగలవేనా?
బండిలో యేముంది, ఎడ్లలో ఏముంది,
బండినాయుని చేతి బలములో ఉంది;

తే నె ప ట్టు

ఈగాలివానలో, ఈచీకటప్పుడు,
గట్టుపుట్టలుదాటి కడకుపోగలమా ?
గాలివానైతేమి, గట్టుపుట్టయితేమి?
చీకటైతేమి మీచిత్తమొస్తేను.
పోకతప్పదు నేను తొందరైయున్నాది,
పోవడానికి నాకు భయమువేస్తోంది.
మీ కేమిభయమండి, బండి నేతోలితే,
బండినాయుని నమ్మి బయలుదేరండి;
వరకమెరకలలోన పడి దెబ్బతీసకుండ,
ఒడుకుదోడుకులు కాచి, బండితోల్తావా ?
మీభారమంతాను నామీదపడవేసి,
బండిలోకూర్చోండి, నన్ను నమ్మండి;
నీమాటవింటేను నినునమ్మ బుద్ధయ్యె,
అద్దేమి నావద్ద పుచ్చుకొంటావు?
ఆనందపురిచేరి ఆమాటచూదాము,
అద్దెకేముండి మీచిత్తముంటేను.
నీవుకోరినదంత నీకు నే నిస్తాను,
నినునమ్మి బండిలో కూరుచుంటాను,
అరగడియలోపల, ఆనందపురిచేర్తు,
భయమేమి లేదండి, బండి యెక్కండి.

---

# చీకటి

## I

*　　　*　　　*　　　లేదు
లేదింకె నాశ
*　　　*　　　*　　　*

క్రమ్మిన చీకట్లు క్రమ్మినట్లుండె;
కప్పినమేఘాలు కప్పినట్లుండె;
పడుచున్న చినుకులు పడుచునేయుండె;
వీమగాలులతోటి లేచు కెరటాలు
పొంగిమీదికి పొర్లిపొర్లి పడుచుండె;
ననుముంచి లోనికీడ్చునో తరంగాలు,
నన్నుద్రోసి, మీదికెత్తునో గాలి — — ?
*　　　*　　　*

గాలితోఁబోయి, మేఘాలతోఁగలసి,
కెరటాలతోఁబోయి యిరులతోఁగలసి,
నిట్టూర్పు గాలిలో నిండఁగాఁజేసి,
కన్నీళ్లు కెరటాల గలయఁగాఁజేసి,
యేడ్చెద మనసార నేడ్చుచుండెదను.
కెరటాల తుంపురుల్ కెలనికివచ్చి,
కారుచీకటి వచ్చి చేరువనిల్చి,
మేఘాలచినుకులు మేనిపైఁ జరచి

ననుఁ బరామర్శింప —

*    *    *    *

వలదు వెన్నెల నాకు, వలదు చుక్కలును,
వేగుఁజుక్కను జూచు వేళయు వలదు;
ఇరులతో, తరగతుంపురులతో,ఁ గలసి,
మొఱయుచిన్కులఁగూడి మొరపెట్టుకొనుచు,
ఏడ్చెద— ఏడ్చెద— ఏడ్చుచుండెదను.

♦ ♦ ♦ ♦

II

చీకటి నెయ్యంపు చెంతఁగూర్చుండి,
ముచ్చటలాడుచు, మురియుచునుండ,
వలిగాలిచుట్టంబు చలిమితో వచ్చి,
అరలేనికూరిమి నరయుచునిలువ,
కారుమబ్బుపడంతి కన్నీరునించి
జాలిగొల్పుచుఁజేరి సందిటనిముడ,
మన్నుమిన్నేకమై మలయుచందాన
దుఃఖంబులోనుండి దుముకుచునుండ,
ఇచ్చకువచ్చిన ట్లేడ్చుకొంటాను.
నాయిచ్చ —

♦ ♦ ♦ ♦ ♦
♦ ♦ ♦ ♦ ♦

ఓదార్పు నాకేల, ఓర్పు నాకేల
వెన్నెల నాకేల, వెలుఁగు నాకేల
నాకేల తారలు, నాకేల తరణి
చలి కాఁడు చీకటి చెదరి మూసంగ
వలిగాలిచుట్టంబు కౌఁగి చూపంగ
మబ్బుతోఁ గాంపుమాయ యొక్కటౌతాను
కాలంపు వెల్లువను కలసి— పోతాను,
కాలంపుసంద్రాన గలసి పోతాను—
కాలమై కాలాన కరగిపోతాను;
— గాలి — చీకటి — మబ్బు —

◆ ◆ ◆

## III

మొదలు తుదయును లేక మొనసి చీకట్లు
నినుగప్పె సంద్రమా, ననుఁబోలె నిప్పుడు
పొంగి, పైకుబుకుచు, పొర్లుచు వచ్చి
దుఃఖంపుఁ గెరటాలు తూలుచునుండ,
నిట్టూర్పుగాలుల నిగుడఁ జేయుచును,
ననుఁబోలె నేడ్చుచున్నావొకో నీవు!
చూడఁ జుట్టము లేక స్రుక్కుచునుండి,
మ్రొక్క దైవము లేక మొరయుచు నిలిచి,
కనువారు వినువారు కనుపట్టకుండ,

ననుఁబోలె నొంటినున్నావె, యీవేళ,
ఇదియె మేలిదియె మేలిదె మేలుసుమ్ము;
మనసారగా నేడ్చి తనివొందనగును
నిన్ను నేనును, నన్ను నీవు నోదార్చు
కొనుచు, కాలము ద్రోసికొనుచు నుందాము.



## IV

గాలి మొండయ్యె మేఘాలు నిండయ్యె,
వాన తొండాలతో పైఁబడుచుండె;
నీకు శక్యముకాదు నాకడ నిలువ,
నాకుశక్యముకాదు నీకడ నిలువ;
నీవు నాలోఁజొచ్చి, నిలువవచ్చెదవొ,
నేను నీలోఁ జొచ్చి నిలువవచ్చెదనొ,
———————వద్దు, నీవునాలోన
గలయఁగా వద్దు———————
నీవు నాయెదలోన నిలువఁగాలేవు
కన్నీళ్ల రూపాన కరగి యుప్పొంగి,
పాటుతో, పోటుతో, పైకివస్తావు
వ్యర్థమే యదిసుమ్ము, వ్యర్థమే, నిజము
నేను నీలోఁజొచ్చి నిలువగల్గెదను;
నీ కసాధ్యము నన్నుఁ బైకిద్రోయంగ,

నేను నీలోన వొచ్చి నిలుచున్న సద్గరము
దివ్య స్వరూపాలఁ దేజరిల్లదము,
ప్రళయ మయ్యెదయాను, ప్రళయమే; యాను.
ప్రళయమున, యోగనిద్రను దేలియాడి,
నీయందు నిల్చి నారాయణునట్లు
నేను నీలోనిల్వ, నీకును నాకు
సర్వైశ్వర్య వైభవంబమరును జుమ్ము:



దరిదాపు గనరాదు; తడవేల నింక,
ఇదిగో, నీలోఁజొత్తు నేను——
————నను గొనుము





# తరంగము

సత్యపి భేదాపగమే,
నాథ, తవాహం, నమామకీనస్త్వం;
సాముద్రోహి తరంగః
క్వచన సముద్రోన తారంగః —

♦ ♦ ♦ ♦ ♦

♦ ♦ ♦ ♦ నా ప్రాణనాథ
నీదు కౌఁగిటిలోన నిలిచిన వేళ
మఱచితి లోకంబు, మఱచితినిన్ను;
నను నేనె మఱచితి; నా హృదయేశ!
నీదు కౌఁగిలివీడి, నిను వీడిపోయి,
యేడనో తిరుగాడి, యేడనో నిలిచి,
పరుగెత్తి, యుప్పొంగి, పైకెగఁబ్రాకి,
పెంపుఁ జెందితినంచుఁ బ్రీతిమిన్నంది,
క్రిందుమీఁద దరయక కెరలుచునుంటి;

♦ ♦ ♦ ♦ ♦

పెనుగాలి వీఁచఁజయ్యన నేలఁబడితి;
నురుగులు గ్రక్కితి; గిరగిరనైతి;
పొరలితి; దరలితి; మరలితి; అంత
మూర్ఛిల్లి తమమున మునిఁగి పోయితిని.

♦ ♦ ♦ ♦ ♦

తెలివి వచ్చెన్; జుట్టుఁ జేరి చూచితిని;

నీదు కౌఁగిటిలోన నిలిచి నేనుంటి,
నీతోడి లోకంబె, నీతోడి బ్రతుకె;
నీతోడి మనికియే నిఖిలమై తోఁచె.
నినువీడి తిరుగను నను కొంచెఁగాని,
నను నీవు విడనాడ నునికియే లేదు.
ఎందు నేఁబోయిన నెందు నిల్చినను,
నను విడనాడక నా ప్రేమ లనిల్పి,
నీ యంకమున నేను నిలుచునందాఁక,
కనిపెట్టికొనియుండి, నను బ్రోచుచుండు
వేమనందును నీదు ప్రేమంపు మహిమ!



నీదు కౌఁగిటిలోన నిలిచిన వేళ
నీవె నేనయి, నేనె నీవయియుంటి;
నాకు నీతోడిదే లోకమైయుండె;
నిను వీడి, యెందొందొ చనుచుండు వేళ,
వెలుఁగునఁ జీకటి లలమికొంచుండు;
కలిమిని లేములు బలిసి కన్పట్టు
శాంతి నశాంతి యాత్యంతికంబు కలుగు;
నిను వీడుకోరిక జనియింపనీక,
నన్నుఁ గాపాడుము నా ప్రాణనాథ;
నీతోడ నిత్యంబు నెనకొందునట్లు,
నీ యంకమే వేళఁ బాయనియట్లు,
నీదు కౌఁగిట నెప్డు నిలిచియున్నట్లు,

## తేనెపట్టు

నీలోనఁ గరఁగి నే నినుఁ గూడునట్లు,
ప్రేమ చూపింపుమో ప్రేమస్వరూప!
నన్నుఁ గాపాడుమో నా ప్రాణనాథ!

   



# సెలవు

పదుగురు నేకమై ముదముఁ గొల్పుచును,
ననుఁగూడి చరియించు నా మిత్రులార,
దయతప్పె నొక్కొ నాపయి నేఁడు మీకు!
కనుట కింపగుదానిఁ గనుచున్న వేళ,
వినుటకింపగుదాని వినుచున్న వేళ,
నాకుఁ దోడయినిల్చి ననుఁ బ్రోచినారు,
నాతోడునీడలై ననుఁగూడినారు;
కష్టంబులగు పనుల్ గావించువేళ
నా యందు దయఁజూపి ననుఁగాచినారు;
కాలమెల్లపు డొక్కగతినుండఁ బోదు;
కష్టముల్ గల్గెడు కాలంబునందు
మిత్రులు శత్రులై మెలఁగుచుండెదరు;
ధైర్య సాహసము లుత్సాహంబుఁగూడి
నాతోడఁ బుట్టువై వనిచినవేళ,
మీరందఱును నాకు మిత్రులే—కాని,
కాలంబు మాఱెఁ గష్టాలు చేకూఱె;
ధైర్య సాహసములు తగ్గుచునుండె;
నుత్సాహ శక్తియు నుడిగిపోసాగె;
మీమైత్రియేమయ్యె? మీపని యేమి?



కనువేళ, వినువేళఁ జనువేళ, మీరు
దవ్వ దవ్వులనిల్చి, తొలఁగుచున్నారు;
మీరు నా మిత్రులు కారంచు నిపుడు
నిశ్చయంబుగఁ జెప్ప నేరనుగాని,
నెయ్యంబు క్రమముగా నీరసమౌట
కనుపట్టుచున్నది ——————
—————కాలంపు మహిమ!
మీ మైత్రి నూతగా మేటికార్యాలు
సలుపఁ జాలితిఁ దొల్లి——————
—.—.———జయము నొందితిని
ఆజయంబుత్సాహ మమరించెనాకు;
తలకు మించిన పనుల్ తలపెట్టినాను,
చేతగాతనుగాక, చెడిపోయినాను,
కారణం బేమి?—————
—————మీ కారుణ్య మకట
యించుకించుక తగ్గి యిట్లు కావించె
అహహా!—ఆ దినముల మహిమయేమందు.—
నా మాటయే మాటనై మేటియయ్యె—
చనుట కంతము లేదు,—చనుచునే యుంటి—
వినుట కంతము లేదు—వినుచునే యుంటి—
కలమెత్తి వ్రాయంగ గమకించునపుడు,
చేయెత్తి పనిసేయ సిద్ధమౌ నపుడు,
ఆ నూస మింకైన నపుడు లేదుండె,

మీరు నామిత్రులై మెలఁగి నారపుడు
కలమెత్తి వ్రాయంగఁ గష్టమా నిపుడు;
చేయెత్తి పనిసేయఁ జీకాకు నేఁడు;
వినుటకుఁ గనుటకుఁ జనుటకు శక్తి
యుత్సాహమును దగ్గుచున్నవి—మీకు
నెయ్యంబు నాపైని నీరసించినది.



ఆడిన యాటయే యాటయైనపుడు
పాడినపాటయే పాటయైనపుడు
పాట నూరువరాల మూటయైనపుడు
మూటవేయి వరాల పాటియైనపుడు,
మీరలందఱునాకు మిత్రులే—నాఁడు—
వినఁగ గష్టంబైన వింతనువింటి,
పాడఁ గష్టంబైన పాటపాడితిని;
చేయఁగష్టంబైన చేత చేసితిని;
చూడఁగష్టంబైన చోటు చూచితిని.
నాపాటివారు కన్పట్టరన్ కీర్తి
గడియించినాను, ఓహో కరుణ నానాఁడు—
ఆ నాఁటి కరుణయే మయ్యె మీకిపుడు ?
వినఁగోరెదను గాని, వినశక్తి తగ్గె;
కనఁగోరెదనుగాని, కనశక్తి తగ్గె;

తేనెపట్టు

బ్రాయంగఁ జేయంగ బలమునుదగ్గె;
శక్తితోఁదగ్గె నుత్సాహ ధైర్యములు;
బలముతోఁదగ్గెను గలిమియంతయును;
బలిమి, యుత్సాహంబు, కలిమి, ధైర్యంబు,
తరలుచునున్నవి — దయమీకుఁ దప్పె —
బ్రతికియున్నాను జీవచ్ఛవంబట్లు;
బ్రతికియుండక చేయవలసిన దేమి?
పోయినదినము లెప్పుడు మఱిరావు,
మఱిరాదు మీలోంటిమైత్రి నాపైని;
ఇంచుకించుక మీరు నేనునుగూడ
దవ్వుదవ్వుగవీడి, తరలిపోయెదము
ననువీడి దవ్వుగాఁ జనెదరుకాని,
ననుఁ దలంతురె, యెందుఁజనినను మీరు?
తలఁతురో మీరు నన్ దలఁపరో కాని,
నేమిమ్ముఁదలపక నిలువఁగా లేను.
మీమైత్రిఁజేసినమేటి కార్యములు,
మీమైత్రిఁజూచిన మేటిదృశ్యములు,
మరణమౌదాఁకనే మఱచిపోలేను
మిముఁదలంపక నేను మెలఁగంగలేను
మీ సహాయములేక మెలఁగిన వేళ,
మీ సహాయపుశక్తి వాసికన్పట్టు



అయినది యేమైన నైనదే కాని;
మీరు నాకొక్క ష్ఠమిత్రులే—నిజము—
కనుముక్కుఁ జెవులును, దనువునాలుకయు,
నగుచు, నా కుత్సాహ మమరించినారు.
కాలుసేయాదిన్యు కరుణ చూపించి,
యేవేళ, నా చెంత నే నిల్చినారు
నుంచిపోలేను మీ మైత్రిని మిమ్ము—
ననువీడిపో మీకు మనసయ్యెఁగాన,
మిము నిల్పుకొనలేను, మీ కేలపంత;
ఇచ్చకు వచ్చిన యెడ కేగుఁడింక;
పదుగురు మీరు; మీ పైనున్న ప్రేమ
యొక్కచోటికిఁ దెచ్చి, యొక్కడనుంచి,
యొక్కండఁ గూర్చుండి, యొక్కనిఁ జూచి,
చింత సేయుదు, వేఱచింత నాకేల ?
అందఱు నా మిత్రులఁటౌ నన్నివేళలను;
కనుగొంటిరో మీరు కనలేదో కాని,
ప్రేమతో మీరునన్ వీక్షించు వేళ
ప్రక్కనే యాతండు నక్కికంచుండె
ననుమీరు దయతోడఁ గనుచున్న వేళ
నాతఁడా ప్రక్కనే యరయుచునుండె.
నేఁడు మీ దయ యిట్టినిరసంబైన
నాతండు చేరువ కరుదెంచినాఁడు,
ఈ ప్రేవ సహింపుఁ డిదగో, యూత్రోవ—

నా సుఖంబులయందు ననుగూడినారు
నా కష్టములయందు ననువీడినారు,
మీరలందఱు; గాని, మిత్రుఁ డీతండు,
కష్టంబులందు, సుఖంబులయందు
ననువిడనాడక, నా ప్రాణాలనిల్పి,
నా మేలుకోరి నన్ గాపాడుచుండు;
మీరు నాతో మైత్రి మెలఁగినవేళఁ
దలఁప లేనైతి నాతని ప్రేమమహిమ
మిమ్ము నమ్మితి, వాని నెమ్మిగనమ్మితిని—
కడచె నా దినములు———

కడచె మీ మైత్రి———

సెలవుఁ గైకొనుఁడు, మీ చిత్తమైనపుడు;
సెలవొసంగుఁడు నాకు———

———చిత్తసారథి !

నీ యనేకమిత్రుల నిరసించుచుండు;
ఇతనితోఁ గాలంబు వేగించుచుందు;
ఇతనితో నేకమై యెలమిమై నుందు,
ఇతనితోఁ గరఁగి నే నేకమైయుందు!
సెలవుఁ గైకొనుఁడు; నే నిలుతు నొక్కఁడనె—
సెలవొసంగుఁడు నన్ను———

సెలవిఁక———

సెలవు———

———

# ఆకు

శ్లో॥ మన్మనాభవ, మద్భక్తో,
మద్యాజీ, మాం నమస్కురు;
మామేవైష్యసి, సత్యంతే
ప్రతిజానే ప్రియోసిమే॥

— శ్రీభగవద్గీత —

శ్లో॥ యస్మాన్నాత్మాత్పరం నాప
మైశ్వరం దృష్టమద్భుతం
సర్వశక్తి సమారూఢం
సమస్త ప్రేరకంపరం
శాంతః సమాహితమనా
డంభాహంకార వర్జితః
తన్నిష్ఠస్తత్పరోభూత్వా
తదేవశరణం వ్రజ॥

— శ్రీదేవీగీత —

• • • నామిత్రులారా,

ననుఁజూచి మీరిట్లు నవ్వెదరేల?

నాదు నేరమియేమి నవ్వుపాల్గాఁగ ?

♦ ♦ ♦ ♦ ♦

రంగులు వాసనల్ సింగారములును,
జక్కని కులుకులు సంపద సొంపు
తళుకులు బెళుకులు తళతళల్ గలిగి,
తలమానికంబయి, చెలిమికత్తియల
కేళివాసములందు రాజిల్లుచుండు
విరికన్నెఁ గాను; నాదరికి రానేల ?
ననుఁజూడఁగానేల, ననునవ్వనేల ?

♦ ♦ ♦ ♦ ♦

♦ ♦ ♦ ♦ ♦

కమ్మందనమ్ములు గ్రమ్మఁబెట్టెడి
దేనియల్ చిప్పిల్లఁ దేటరసమ్ముఁ
గుమ్మరించి, మనమ్ముఁ గ్రమ్మించుచును,
దూలలేని చెలువునఁ జెలిమి కత్తియల
కరములలో హాయియల్ గనిపించుచుండు
పండుకన్నెను గాను; ————

♦ ♦ ♦ నచ్చెదవేల ?

ననుఁ బేరఁగానేల, ననునవ్వనేల ?

♦ ♦ ♦ ♦

♦ ♦ ♦ ♦

లేదు సింగారంబు, లేవు రంగులును;

వాసనల్ లేవు, సంపదసొంపు లేదు;
కులుకులు, తళుకులు, బెళుకులు లేవు;
రసమైన లేదు, నీరసమైన బ్రదుకు
బ్రదుకుచున్నాను;————
♦ ♦ ♦ నావద్దకు మీరు
రానేల? ననునవ్వఁగానేల?——
♦ ♦ ♦ వలదు.
♦ ♦ ♦ ♦
♦ ♦ ♦ ♦
♦ ♦ ♦ ♦
చిగురుటాకును గాను; చెలిమికత్తియలు
ననుఁ జేరఁగా రారు; ననుఁజూడఁబోరు;
పండుటాకునుగాను; వడి నేలరాలి
కాలసముద్రానఁ గరఁగి పోవంగ——
ముదిరినయాకును————
♦ ♦ ♦ ముదముదయేల?
సిగ్గేల, కలమాట చెప్పినయపుడు ?
తల్లి చాటు నిల్చి తన రారు కతనఁ
బ్రేమతోఁ దల్లినన్ బెంచినకతనఁ
పసిమితో నిట్లు కన్పడుదునుగాని,
ముదిరిపోయితిని; నన్గదియఁగానేల ?
ననుఁ జేరఁగావద్దు; ననుఁజూడవద్దు;

## తేనె పట్టు

ననుఁజూడఁగా వద్దు ననునవ్వవద్దు.

♦ ♦ ♦ ♦ ♦

♦ ♦ ♦ † ♦

నా తల్లి యీ చెట్టు నన్నుఁ గాంచినది;
కనుపార ననుఁ గాంచి, కౌఁగిలించినది;
ఆనందపారవశ్యమున మించినది;
ఏల నన్గాంచెనో యెఱుఁగను నేను;
నాకేల యాచింత?——————

♦ ♦ ♦ ♦ నాతల్లియిచ్ఛ!

నా చిన్నతనమున ననుఁజూచియొక్కఁ
డందకత్తె నటంచు ననియుండెఁ గాని,
యందమో, చందమో, యదియేమొ నెఱుఁగ——

♦ ♦ ♦ ♦ ♦

♦ ♦ ♦ ♦ ♦

నాతల్లి ప్రేమతో ననుఁ బెంచుచున్న
దీ తాపువిడి నేనెందుఁ బోలేను;
తనకు నచ్చినరీతి ననుదిద్దెఁ దల్లి;
తనకుఁ దోఁచినరీతి ననుఁ గయిసేసె;
ననుదిద్ది కైసేసి, తనివిసె మాతల్లి;
తల్లి నన్ జూచి సంతసమందుచున్న,
నాలోన నేను సంతసమందుచుందు;
ననుఁ జూచి తల్లి, తల్లినిఁ జూచి నేను
దనియుచున్నాము;——

♦ ♦ ♦ దినములు గడచె;
దినములు గడచె, నెందునుజన లేదు;
ఎందుఁబోలేదు నేనేమియు నెఱుఁగ;
నిపుడు నన్జేరఁగా నేటికి ?——
♦ ♦ ♦ ♦ వాఁడు.
♦ ♦ ♦ ♦ ♦
♦ ♦ ♦ ♦ ♦
♦ ♦ ♦ ♦ ♦

ఏమి కావలయునో, యెఱిఁగినాకిచ్చి
నాదుభారముపూని ననుపుమీరంగఁ
బెంచుచునున్నది ప్రేమనాతల్లి—
తల్లి గర్భమునుండి తరలివచ్చితిని;
తల్లియంకమ్మునఁ దగఁగూరుచుంటి;
తల్లిచెంతనెయుంటి నెల్ల వేళలను;
తల్లి నన్జూచినఁ దనివిని జెందు;
తల్లిని నేఁజూచి తనివిచెందెదను;
పెరిఁగితినినాళ్లు————
♦ ♦ ♦ పెంచెమాంతల్లి;
ఏపని చేయుట యెఱుఁగను నేను;
చెప్పి నాచేఁ బనుల్ సేయించుఁదల్లి;
నన్నుఁబోటి వారలున్నారు నాతల్లి
కెందఱొందఱో కాని, యింతకంతయును

దఱుఁగదునాపైని దల్లికిఁబ్రేమ,
కడచె ముప్వంతుల కాలమీరీతి;
ఇపుడు నాచెంతకు నేలవచ్చితిరి ?
ననుఁజేరఁగానేల, ననునవ్వనేల ?

* * * *

* * * *

ధూళికి, గాలికిఁ దూలిపోకుండ,
ననుఁబట్టుకొని పెంచె నాతల్లినన్నుఁ
గడచె ముప్వంతులు కాలమీరీతి;
కడమ కాలంబిట్లె కడపెద నిచట——

♦ ♦ ♦ ♦

♦ ♦ ♦ ♦

తల్లినన్ బెంచును దలఁకింత లేదు;
తల్లిపై భారమంతయు వైచినాను;
తల్లి చెప్పిన పనుల్ తగఁజేయుచుందు;
తల్లిచుట్టమునాకుఁ దల్లిదైవంబు;
తల్లిని నమ్మితి————
♦ ♦ ♦ తల్లిచెంగటనె
కడమకాలంబును గడపివైచెదను;
పడిపోయెదను దల్లిపాదము లొద్ద;
దల్లిపాదములొద్దఁ గుళ్ళిపోయెదను;
తల్లిగర్భముఁజొచ్చి ధన్యనైపోదు;

ననుఁజేరగావద్దు, ననుఁజూడవద్దు;
ననునవ్వఁగావద్దు, నామిత్రులార,
దవ్వుగాఁ బొండు———



———

I am the Vine and you are the branches. * * * Without me, you can do nothing. If a man abide not in me, he is cast forth as a branch and is withered; and men gather them and cast them into the fire and they are burned. If you abide in me, and my words abide in you, you shall ask what you will and it shall be done unto you.

— *The Holy Bible* —

Live while you live, the epicure would say,
And Seize the pleasures of the present day;
Live while you live, the Sacred preacher cries;
And give to God each moment as it flies,
Lord, in my views, let both united be;
I live in pleasure when I live to thee.

*Doddridge.*

# అడవిమల్లె

**Ask and it shall be given you;
Seek and you shall find;
Knock and it shall be opened unto you:
for, every one that asketh receiveth;
and he that seeketh findeth; and to him
that knocketh it shall be opened.**

— *The holy Bible* —

మాయమ్మ నాకొక్క మాణిక్యమిచ్చె;
మాణిక్యమునుజూచి మదిఁబొంగినాను;
దినమునకొక క్రొత్త తీరుగాఁదోఁచి,
మదికి నుత్సాహంబు మాణిక్య మొసఁగె;
ముద్దులు గురియుచు, మురిపెంబు గొనుచుఁ,
జెలిమి మాణిక్యంబు సేయుచునుండె;
తళుకు తళుక్కను తనుకాంతితోడ
మురిసి మాణిక్యంబు మోదం బొసంగె;



నిలిచినఁగూర్చున్న, నిదురవోయినను,
జెలులతో ముచ్చటల్ పలుకుచుండినను,
ఏకాంతముననుండి, యీశ్వరింగొలిచి,
ధ్యానించుచున్నను, ప్రార్థించుచున్న

నేమి తలంచిన నేమిచేసినను,
నాదుమాణిక్యంబు నాచెంత నుండె,
చెంతనుండి ముదంబు చిందించుచుండె.



చనుచుండె నీరీతి దినములు నెలలు;
నెలలును నేండ్లును నిలువక చనియె;
ఏఁడొక దినముగా నేగె నీరీతి;
దినమొక గడియగాఁ జనియె నిమ్మాడ్కి;
ఆనందమునఁ దన్మయంబయ్యె మనము;
ఎన్ని యేండ్లయ్యెనో యెఱుఁగను నేను;
అంతయు నొకదినమ్మైనట్లు తోఁచె.
తన్మయంబైన చిత్తముతోడ నెపుడు
నేను మాణిక్యంబు నెటఁగూడి యుంటి
మితరచింతలుమాని యేకభావమున,
ఆటలఁ బాటల నానందమిచ్చి,
నాకు మాణిక్యంబు ననుపులు గఱపె.
చెంత మాణిక్యంబు చేరియున్న పుడు
క్రొత్తభావంబులఁ గుఱియుచునుండి
నా కవిత్వంబు విన్నాణంబు నొందె,
మాణిక్యమును నేను మలసియీరీతి
దినములు సాగించుకొనుచుంటిమి— — —





ఐన,

—అకట—ఏమందు—అన్యాయంపుబలిమి!
కాల మెల్లప్పు డొక్కగతినుండఁబోదు;
ఏవేళ కేమౌనో యెవ్వాఁ డెఱుంగు?



మాణిక్యమొకనాఁడు మఱిమఱి వెలిఁగి,
యెన్నశక్యముకాని హృత్ప్రీతి నొసఁగె,
మఱచితి లోకంబు, మఱచితివేళ,
నను నేనె మఱచి యానందమైయుంటి;
ఆడితిమాణిక్య మఱచేతఁదాల్చి;
ఎగురవైచితి, దాని నెగసి పట్టితిని,
ఎగుర వైచుచుదాని నెగసి పట్టుచును,
నాటాడసాగితి నద్దానిఁ గూడి,
ఎగయుచుఁ దిగుచును, నెగయుచు, మరలఁ
నాడించి పట్టులే యాటలాడుచును,
మదికి మాణిక్యంబు ముదమిచ్చుచుండెఁ,
మోదమున బొదలుచు మదినిద్ర వోయె;
మాణిక్యమేడనో మాయమైపోయె;



తెలివి వచ్చెను-చుట్టుఁ దేరి చూచితిని——
లేదుమాణిక్యంబు లే దఱచేత——
అఱచేతి మాణిక్య మక్కటా--పోయె——
ఈవలఁగంటి నే నావలఁగంటి;
నేవలఁగన్నను నేమి లాభంబు ?
లేదు మాణిక్యంబు లే దేడఁగూడ,
మాణిక్య మేమయ్యె?————

♦ ♦ ♦ మఱికనంబడదు.

పోయె మాణిక్యంబు, పోయె నయ్యయ్యొ;
అయ్యయో మాణిక్యమదిపోయె నెటకో!
కలయయ్యె మాణిక్య మలయిక కలిగె;
నలయిక తోడ నే నఱవసాగితిని;
అఱచితి——వెఱచితి——పఱచితి——మఱల
నఱచితి——వెఱచితి——పఱచితి——కాని,
మాణిక్యమొకసారి మఱికంట బడదు

♦ ♦ ♦ ♦ ♦

♦ ♦ ♦ ♦ ♦

♦ ♦ ♦ ♦ ♦

అమ్మరో, మాణిక్య మదిపోయెనమ్మ,
ఎయ్యెడఁబోయెనో యెఱుఁగ నోయమ్మ
ఏమిచేసెదనమ్మ యేమినాకర్మ
మేగతి గలదమ్మ, ఏమి చెప్పెదవు ?

తే నె ప ట్టు

నాకర్మ మేమమ్మ, నాగతియేమి?
అనుచు నేడ్చుచుఁబోయి, యమ్మపాదముల
నశ్రులఁ దడుపుచు, నఱచుచునుండ
నఱచేత మాయమ్మ యుంచెను నా శిరము,
అఱచేత శిరమంటి, యాశీర్వదించి
యమ్మ యిమ్మెయిఁ బల్కె నను నయించుచును,
'పోయెఁబోయె నటంచుఁ బొక్కుచునిట్లు
లఱచిన మాణిక్య మబ్బునే మఱల?
వెదకుము మఱిమఱి వెదకుము తండ్రి,
వేఱొక్క పనిమాని వెదకుము దాని
పౌరుషంబునఁ గాని పనులును గలవె?
వెదకి, కన్గొను టె వివేకంపుఁ దెఱవు;
వెదకుము—చూడుము—వెదకి కన్గొనుము
నాముద్దుఁగుఱ్ఱ, మనశ్శాంతి నీకుఁ
గలుగును—వెదకుము—తలఁకొందవద్దు—
అమ్మ యిమ్మాడ్కి నాకాజ్ఞ యొసంగె;
నమ్మ యాజ్ఞను శిరంబందుఁ దాల్చితిని
వేఱొక్క పనిమాని వెదకసాగితిని,

♦ ♦ ♦ ♦

♦ ♦ ♦ ♦

♦ ♦ ♦ ♦

వెదకితి—వెదకితి—విసివిపోయితిని,

కాని, మాణిక్యంబు కానరాకుండె
పిచ్చి యెత్తినయట్లు వెదకసాగితిని;
పిచ్చిపట్టినరీతిఁ బిలువసాగితిని;
పలుకరింపఁగ లేదు, పలుకాడ లేదు,
మాణిక్య ముకసారి మాటాడ లేదు
పలుకాడ లేదు—చూపట్టఁగా లేదు—
ఇంక నామాణిక్యమెచటఁ గన్పట్టు!
పిచ్చి యెత్తినరీతి వెదకసాగితిని—
ఇలువీడి దవ్వుగా నేగసాగితిని—
ఎటుపోవుచుంటినో యెఱుఁగను నేను,
పోవుచు నుంటిని—పోవుచునుంటి.

♦ ♦ ♦ ♦

చీకటి యంతటఁ జిక్కనై యుండెఁ
ద్రోవకన్పడకుండెఁ దోఁపుఁబాటయ్యె;
ఆకసంబునఁ దేరి యరయసాగితిని;
కోటిమాణిక్యాలు కూడికన్పడియె.
కోటిమాణిక్యాలు కూడిన నైన,
నాదుమాణిక్యంపు మోదమీఁ గలవె?
లేదుమనశ్శాంతి—లేదు సంతృప్తి—
నాదు మాణిక్యంబు నాకుఁ గన్పడదు!

* * * *

* * * *

కుంచాలతో మంచు కుఱియుచునుండె;
వలిగాలి వడవడ వడకించుచుండె;
చలియును మంచును దెలియరావయ్యె;
మాణిక్యమునుజూడ మదికోరుచుండె;

* * * *

పోయితి—పోయితి—పోయితి నటకా—
పోవుచునుంటిని—త్రోవతప్పితిని—
దవ్వయ్యె మాయిల్లు—దవ్వు దవ్వయ్యె—
చలిబాధ మెండయ్యె—నిలువెల్లఁ దడిసె
గాని, మాణిక్యంబు కనఁబడకుండె.
దాఁటితిఁ దోఁటలు, దాఁటితి నిళ్లు,
దాఁటితిఁ బుట్టలు—దాఁటితి గట్లు;
దాఁటితి నేళ్లను, దాఁటితి నూళ్ళు
ఇళ్ళను, దోఁటలు, నేళ్లను, నూళ్లు,
నెన్నో దాఁటితిఁగాని, యేమిలాభంబు?

* * * *

తెల్లవారఁగఁజొచ్చెఁ, దిమిరంబువోయె;
వెచ్చని వెలుఁగుతో వెలిఁగె సూర్యుండు;
చలికి మంచుకు నాకుఁ గలిగిన బాధ
వెచ్చని యెండచే విరిసిపోసాగె,
లేయెండ నాకింత సాయంబొనర్చె,
నాడు మాణిక్యంబు నాకిచ్చునంచుఁ

బుట్టెఁడాసను బొంది పోవుచునుంటి,
చెట్లు చేమలుపోయె; మట్టినేలలును,
బసిమిచాయలుపోయె; నిసుకయెడారి
కనుపట్టె—దానిలోఁ జనుచునేనుంటి,
గట్టినేలలుపోయె—పట్టి యెడారి
నిసుకలోఁ గాలూని యేఁగుచునుంటి
ఎలయెండ వెచ్చనై యింపయ్యె నిసుక
దొరకు మాణిక్య మంచరయుచునుంటి
ఆకసంబున మీఁది కరిగె సూర్యుండు;
ముదరి వేఁ డెక్కెఁడై, కదిరెనెండయును
ముదిరిన యెండతో ముదరెను వేఁడి;
వేఁడియు నిసుకయుఁ గూడె నెయ్యమున;
వేఁడియు గాలియుఁగూడెఁ బ్రేమమున
కాలిన యిసుకలోఁ గాలెఁ బాదములు,
కాలిన యెండలోఁ గాలెను దలయుఁ
గాలిన గాలిలోఁ గాలె దేహంబు;
తలయును, దేహమును, బాదంబులు మాడి,
దాహంబుతోఁగూడి దహియింపసాగె,



లేదు చల్లనినీడ, లేదు జలంబు,

మలమల నిసుకలో మాడుచునుంటి,
ముందుకుఁబోలేక మూల్గుచునుంటి,
వెనుకకుఁబోలేక, విసుగుచునుంటి
వెనుఁజూచి, మునుఁజూచి, వెఱచుచునుంటి,
లేదు మాణిక్యంబు, లేదు మోదంబు
ప్రాణమే లేకున్న పగిదిఁ గన్పట్టె.

• • • •

మట్టమధ్యాహ్నాన వట్టియెడారి,
బట్టబైటను నిల్చి, పడరాని పాట్లు
పడుచున్న నాపైని విడలేమి కినుక ?
కొనవేమి జాలి; చేకొనవేమి నన్ను,
నాయమ్మ, నాతల్లి, ననుఁగన్నతల్లి,
నాయమ్మ నీకిది ? ననుఁ జూడ వేమి ?
తలఁదాల్చి నీ యాజ్ఞ, యిలు వీడినాను;
వెదకి మాణిక్యంబు వీక్షింప నెంచి,
గండ్లను ముండ్లను గడచనినాను;
త్రోవ తప్పించి యీ త్రోవఁబెట్టితివి.
ఈత్రోవఁ బెట్టితివేటికోయమ్మ!
మలమల నిసుకలో మాడ్చుచున్నావు—
అగ్ని పరీక్షచేయఁగ నేల! తల్లి!
కలదో నీపై భక్తి కలదొకో లేదో,
కలదో మాణిక్యంబు గనువాంఛ, లేదో,

తెలియఁగా నెంచి, యీ తీరుననన్ను
నగ్నిలోఁబడఁద్రోసి, యలయింతువమ్మ!
నీ పరీక్షకు నేను నిలువఁగాఁ గలనె,
భరియింపఁజాల నీబాధ నాతల్లి!
మాణిక్యమునుజూడ మదిఁగోర్కె విడదు,
భక్తి నీపైనాకుఁ బలుచఁ బాఱదును—
వలదింకను బరీక్ష—నిలువఁగాఁజాల—
జాలిచూపించి నన్నేలుమో తల్లి;
యనుచు నీ రీతిగా నమ్మను వేడి,
యమ్మను గొలుచుచు, నడుగు ముందిడఁగఁ
జల్లఁగాఁజిఱుగాలి చనుదెంచె నపుడు.



హాయి గొల్పెను జల్లనైన యాగాలి
యాగాలి వచ్చినాయసువులు నిలిపె
లేనిసత్తువ వచ్చిపూనె నాయెదను
గాలివచ్చిన దెసఁ గాల్ద్రిప్పినాను
చయ్యన గమనంబు సాగించినాను.
ఇంచుక దవ్వనే నేఁగక మున్నె
ఖర్జూర వృక్షంబు గన్పట్టె దవుల
రమ్ము రమ్మని పిల్చెఁ గొమ్మచేతులను

వడివడి యాదెస నడచిపోయితిని;
ఖర్జూర వృక్షంబుకడ నిలుచుంటి
అచటఁ గన్పడెనొక్క యమృతంపు బావి
హాయిగాఁ జలిగాలి యటవీచుచుండె
చల్లగాలికిఁ దెప్పిరిల్లెఁ జిత్తంబు;

♦ ♦ ♦ ♦

ఖర్జూరవృక్షంబుకడఁ గొంత సేపు
చెమ్మటలాఱంగఁ జేరినిల్చుంటి;
కుదుటఁ బ్రాణంబులు కూడెన్నొక్కింత
అమృతంపుబావి మెట్లకడ పోయితిని
అమృతంపు బావిలో నానంద మొప్ప
మునుఁగుచుఁ దేలుచు మునుఁగుచునుంటి
మాణిక్యమనుమాట మఱచితినచట
అంతలో మాణిక్యమనుమాట తోఁచ
బావిలోపలనుండి పైకి వచ్చితిని
మాణిక్యమునుజూడ మరులుఁ జెందితిని.
ఖర్జూర వృక్షంబుకడకు వచ్చితిని.
అమృతంపు బావిలో నటజన్మమంది
యల్లిబిల్లిగ నల్లి కొల్లలుగాఁజూచి,
యడవిమల్లియతీఁగె యలరారుచుండె;
కొమ్మచేతులతోడఁ గోరి వృక్షంబు
దయఁజూపె నడవిమల్లియతీఁగె నాకు,

అడవిమల్లియతీఁగ నరసికన్గొంటి,
నానంద మొకసారి యావిర్భవిల్లె;
మాణిక్యమనుమాట మఱచిపోయితిని.
అడవిమల్లియపైని స్వాంతంబు నిలచె.
ఎన్ని జన్మములందొ యేనును నదియుఁ
గలసి యానందంబుగనియున్న యట్లు
చప్పునఁదోఁచె నాస్వాంతంబునందు.
అడవిమల్లియతీఁగ నపుడు కౌఁగింటఁ
జేర్చి యానందంపు సీమదాఁటితిని.
పక్వఫలంబు లుపాయనమిచ్చి,
ఖర్జూర వృక్షంబు గౌరవంబిచ్చె.
అమృతంపు బావిలో నమృతంబు గ్రోలి
ఖర్జూరఫలములుత్కళికభుజించి
అడవిమల్లియతోడ నాడసాగితిని
మాణిక్యమనుమాట మఱచిపోయితిని.
మఱచితిలోకంబు మఱచితి నిల్లు;
అడవిమల్లియఁగూడి యాడుకొంచుంటి.
కలిగె మనశ్శాంతి - కలిగె సంతృప్తి—
కలిగె నానందంబు - కలిగె నన్నియును.
అమ్మ చెప్పినమాట యనుకొంటి నపుడు;
వెదకి కన్గొను టవివేకంబటంచు
నమ్మ చెప్పినది సత్యంబుగాఁదోఁచె.

కళాపరిచారక సమితి, బరంపురం.

# రాయబారము

[ రెండు సంపుటములు ]

౧వ సంపుటము **సంజయరాయబారము** వెల రు1/-

౨వ సంపుటము **శ్రీకృష్ణరాయబారము** వెల రు1/-

అనుబంధము ౧ **తేనెపట్టు** వెల 8 అణాలు.

దేవరాజు వేంకట కృష్ణారావు, బరంపురం.